శ్రీరస్తు.



# శ్రీ భద్రాద్రిచరిత్రము.

ఇది

ధవళేశ్వరములో

డి. పి. డబ్లియు., హెడ్ క్లర్కుగానున్న

బొండాడ సూర్యనారాయణచే

రచియింపఁబడి

---

మచిలీపట్టణము టి. ఎల్. కె. ప్రెస్ నందు

తురగా నరసింగరావుగారిచే

ముద్రింపించి, ప్రచురింపఁబడినది.

---

మొదటి కూర్పు 500 కాపీలు.

# పీఠిక

శ్రీ గౌతమీమాహాత్మ్యంబు నందీ భద్రాద్రిచరిత్ర వ్రాయఁబడియున్నది. ఆ గ్రంథమును జదివి యర్థమును వ్రాసిచ్చిన మ॥ రా॥ రా॥ శ్రీ. నున్న వేంకటాచార్యులవారికిని, భద్రాద్రి కేగుతఱి, యాత్ర తీఱిన పిదప. శ్రీరామానుగ్రహంబున, భద్రాద్రిచరిత్ర వ్రాయఁగలవాఁడవని, యాశీర్వదించి, తద్రచనకు, నన్నుఁ బురికొల్పిన, మ॥రా॥రా॥ శ్రీ. మైలవరపు నరసింహము పంతులుగారికిని, మ॥ రా॥ రా॥ శ్రీ. దర్భా ప్రభాకరశాస్త్రిగారికిని, నావందనములు. నావలె, యాత్రార్థమై వచ్చినట్టియు, నాకు బాంధవుండునైనట్టియు, మ॥రా॥రా॥ శ్రీ. పేరివెల్లి వేంకటస్వామి నాయుఁడుగారిని, భద్రాచలమునఁ గలిసికొనఁగా వారును, నన్ని గ్రంథరచనకు మిక్కిలి హెచ్చరించిరి. కావున వారికిని, నచ్చొత్తించుటకు మున్ని గ్రంథమును సాంతముగావినిన మ॥రా॥రా॥శ్రీ. శిష్ట్లా నరసింహశాస్త్రిగారికిని, మదీయ ప్రణామంబులు. శ్రీభద్రాచల గ్రంథ నిలయమువారిచేఁ బ్రచురింపఁబడిన భద్రాచలచరిత్రనాఁ బడు గద్యకావ్యమునకును, గౌతమీమాహాత్మ్యంబున వ్రాయబడిన విషయంబునకును గొంతభేదము కనఁబడుచున్నయది. ఈగ్రంథ మీరెంటి ననుసరించి వ్రాయఁబడినది.

ధవళేశ్వరము,
**15-4-15.**

ఇట్లు బుధజనవిధేయుఁడు,
బొండాడ సూర్యనారా



[illegible]

శ్రీరామచంద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీ భద్రాద్రి చరిత్రము.

---

క॥ శ్రీలలర సుజన కోటికి ।
మేలొసఁగుచు గిరులలోన • మేటియనంగాఁ ।
[illegible]లెడి భద్రాద్రి వఱుఁ ।
గ్రాలెడి శ్రీరామభద్రుఁ • గరము నుతింతుఁ॥ 1.

ముప్పవారు వేల్పులఁ • బోలువారఁ గొలిచెద ।
నిప్పచ్చరంబుల • న్నియుఁ దొలంగ ।
ముప్పరమ్మలకును • మ్రొక్కుల నొనరింతు ।
నక్కటికంబుతో • నరయు కొఱకు ।
ముక్కంటి గారాబు • ముద్దుపట్టిఁ దలంతుఁ ।
బనిచెఱుపుల నెల్లఁ • బాఱఁదోలఁ ।
బొత్తముల్ వ్రాయంగఁ • బూనినవారలు ।
తప్పక గొలిచెడి • తలిరుబోడి ।

వారలపాపముల్ ◆ వాపుమటంచెడి ।
భద్రాద్రిదలము తగు ◆ భవ్యులార! ।
ఆభద్రశిఖరముం ◆ దతిముదంబు దలిర్ప ।
శ్రీరామచంద్రుండు ◆ సీతతోడ ।
గీ॥ ననుజాతోడను వసియించి ◆ యనుదినంబుఁ ।
దన్నుభక్తిమై దర్శించు ◆ ధన్యులకును ।
ముక్తినొసఁగుచు నుండు న ◆ ప్పుణ్యకథను ।
మీకు నెఱిఁగించెదను దయ ◆ మీఱ వినుఁడి॥ 9.

—◆ శ్రీ భద్రాద్రిచరిత్ర కథాప్రారంభము. ◆—

సీ॥ అరులను గెల్చుచో ◆ హరునకువిల్లయి ।
ప్రఖ్యాతిఁగాంచె నే ◆ పర్వతంబు ।
జేజేలు తమకూర్మి ◆ చేడెలతోఁగూడి ।
క్రీడించుచుందు రే ◆ గిరిని సతము ।
బంగారు కొండనై ◆ పచ్చని వన్నెతోఁ ।
బ్రబలుచు నుండు నే ◆ పర్వతంబు ।
సూర్యచంద్రములు ◆ సొబగార వలగొనఁ ।
గ్రాలుచునుండు నే ◆ గట్టురాయఁ ।
గీ॥ డట్టి మేరుగిరీంద్రుఁ డ ◆ త్యధికభోగ ।
భాగ్యరాసులు తనకూర్మి ◆ పడఁతితోడఁ ।
బెక్కువర్షముల్ పొందియుఁ ◆ బ్రియతనూజుఁ ।
డొక్కఁడును లేక యున్కిఁ ◆ సొక్కుచుండె॥ 10.

ఆ. ఎన్నిసంపద లుండిన • నేమి? యొక్క |
సుతుఁడు లేకున్న హర్షంబు • సున్నయగును |
గద గృహంబున సద్గాని • మదిఁదలంచి |
కొమరుఁ గోరుచునుండెను • కొండతేఁడు || 11.

క. అతని ప్రియసతియు నదే |
రీతిఁ జింతించుచుండఁ • బ్రియసిఁ గని యో |
నాతిరో! దుఃఖింపకుము వి |
ధాతకు మనయం దొకింత • దయలేదకటా! || 12.

గీ. గురుని సేవింపకయ విద్య • గోరవశమె? |
యన్న మొసరింపకయ విత్త • మందవశమె? |
పూర్వభవమునఁ జేసిన పుణ్యమింతఁ |
బొందకయ పుత్రికుల నిలఁ • బొందవశమె? || 13.

ఉ. కావున నేగువాఁడనిదె • కాననసీమకు నేఁగి, యందువా |
శివునుగూర్చి చేసెదను • నిశ్చలమైనతపంబు ; దానిచే |
నావిధిమెప్పులఁ బడసి • యాతనితో మనకోర్కె చెప్పి యిం |
దీవరనేత్రి నీవెతను • దీర్చెద వేగమె పోయివచ్చెదన్ || 14.

క. నేవచ్చునంత వఱకును |
నావంతయుఁ జింతలేక • యనుదినమున నీ |
భావంబునఁ బరమేశ్వరు |
భావింపుము భక్తితోడ • భద్రోదయమా! || 15.

చ॥ అనుటయు నాసతీమణియు • నాత్మవిభుం గనని ప్రాణనాథ య
వ్వనమున కేమవచ్చితివి • పాదములొత్తుచుఁ గూరుచుండి నే
వనుపచరింపఁ గోరెదను • వల్లనకియ్యకొనుము నావుడున్
దనపతిఁ గాంచి నవ్వుచును • దద్దయుఁ బేర్మి గిరీంద్రుఁ డిట్లనున్

గీ॥ కందమూలాదులను దిని • కాననమునఁ ।
తపమునర్చెడు వానికిఁ • దరుణి యెదుటఁ ।
గానుపించిన భంగంబు • గలుగుఁ గానఁ ।
బడఁతి యుండంగఁ దగదు నా • పసుని మ్రోల॥ 17.

ఉ॥ కారణమెట్టులుండ నిఁకఁ • గాంతరొ! నిర్జనసీమయందు బల్ ।
కూరిమిలో మదంఘ్రులను • గోమలమా భవదీయహస్తపం ।
కేరుహ మంటినంతటన • కేరుచుమాకును హానిఁ జేసెడిన్ ।
వారిజనేత్రి యందువల • నర్ దపమెట్టులు సేయ నోపుదున్॥

గీ॥ తపము నొనరించి మించి వి • ధాతఁ గాంచి ।
విరకుమారునిఁ గనియెడి • వరముఁ బడసి ।
వేగఁ జనుదెంచువాఁడ నో • చెలిమిమిన్న! ।
యంతదనుక నీవిచట నే • యాను మబల! ॥ 19.

క॥ అని తన దేవిని వీడ్కొని ।
ఘనుఁ డా గిరివర్యుఁ డపుడ • కాననమునకున్ ।
జని యచ్చోటున నిశ్చల ।
మనమునఁ దపమాచరించె • మానులు వొగడన్॥ 20.

క॥ ఎండల వానల నలయుచు ।
నుండియు బహువత్సరంబు • లుద్దండ తపం ।
బండజవాహను గూరిచి ।
కొండలమొకిమీాను చేసెఁ । గొంకక భక్తిన్॥ 21.

సీ॥ పరమేష్ఠి యమ్మేరు • గిరితపంబున కాత్మ ।
నలరివాగ్దేవితో • హంసనెక్కి ।
సకల బృందారకుల్ • సర్వమునీంద్రులు ।
సంస్తుతి నొనరింప • నంతసించి ।
మేరుగిరీంద్రుని • మిక్కిలి ప్రీతితోఁ ।
దపమాచరించెడి • స్థానమునకుఁ ।
జని కొండమొదటను • సాక్షాత్కరించిన ।
గని గట్టురాయఁడ • గ్గలపు భక్తి॥

గీ॥ పెంపునను వేల్పుపెద్దను • తింపనెంచి ।
యతని తేజంబునకుఁ గను • నబ్బు పడుచు ।
నోట మాట రాకుండి య • నూనకాంతి ।
మించు నద్దేవునట్లి వీ • క్షించుచుండె॥ 22.

క॥ అతని మతిభ్రమముగ గని ।
చతురాస్యుం డిట్లులనియె • సస్మితముఖుఁడై ।
మతిమంత! యెఱుఁగఁ బల్కుము ।
మతిలోపలివాంఛ నేను • మాన కొసఁగెదన్॥ 23.

సూనగతులు పొంగ్రాంగ • మలయమారు।
తంబు మెల్లగవీచెన • తరుణమందు। 33.

తే: గాలివీచుచుండె • గాజుకుప్పెరు దెచ్చి
పెన్నిపనెుకతి • బొట్టువలయు।
సమయముఁ దలఁచి దేవ • వనిత లాభాతి నొ
నప్పిపట్ట్ల శశి తంనర్చె నింగి॥ 34.

క॥ అగత్తి మెరుగిడించుగ్రిం।
నారిత సౌఖ్యాబ్ధి మునిఁగి • యుడ్డానసౌ
ఖ్యతిమును నొక్కపాన్పున।
గాతిని సర్వంబు గడపం ద్రక్కి దలిర్చ॥ 35.

సీ: విరవిహాగంబు నిక్కమే • గిరివరేణ్య
న్యైన వేకువసమయాన • నతివతోఁడ।
బవ్వళింపంగ రాదంచుఁ • బలుకుభంగి।
విహాగ నాదంబు లొప్పారె • వేఁగుతఱిని॥ 36.

గీ: తెల్లవాఱంగ మేల్కొని • యుల్లమలరఁ।
బగలుపేరిటి స్త్రీ తన • ఫాలమందు।
నెలమిఁ దాల్చిన కుంకుమ • తిలకమనఁగ।
భానుఁ డుదయించె నప్పుడు • ప్రాచియందు॥ 37.

క॥ శివగుఁడు నిద్ర మేల్కొని।
పరమేశ్వరు విమలపాద • పంకరుహంబుల్।

క॥ పదిదినములైన పిమ్మట ।
మదిరాక్షికిఁ జేసి రెలమి • ముగువల్ పురిటిన్ ।
బదిలముగా వత్సయు సాం ।
పుదరి నుయ్యాల మంచ • మున శయనింపన్॥ 43.

క॥ జోజో ముద్దుల పట్టీ ।
జోజో రతనాల పెట్టీ • జోజో చిట్టీ ।
జోజో కూరిమి శెట్టీ ।
జోజో యని పాడి రపుడు • సుదతుల్ జోలల్॥ 44.

క॥ దిన దినము వృద్ధి నొందెడి ।
వనజారి విధానఁ బెరుగు • బాలునిఁ జేర్చన్ ।
గనుఁ గొనుచుఁ దల్లి దండ్రులు ।
ఘనముగ శౌచాదులెల్లఁ • గావించి రొగిన్॥ 45.

క॥ తనయున కెలమిని భద్రిం ।
దనియెడి నామంబు నిడఁగ • నబ్బాలుంకున్ ।
జనని జనకులు “ భద్రి ” ।
యని పిలువఁగ నగుచు వారి • యందకుఁ బాఱున్॥ 46.

సీ॥ అంత నైదవయేట • నబ్బాలుఁ డాచార్య ।
వరులొద్ద నక్షరా • భ్యాసమందె ।
సకల శాస్త్రంబులు సత్వరంబుగ నేర్చి ।
విద్యల నన్నిటఁ • బెద్దయయ్యె ।

బాలకుండయ్యును • బరమేశ్వరుని పాద |
పద్మంబులే మదిఁ • బ్రస్తుతించు |
శిష్యులతోఁ జెల్మిఁ • జేయుచు నుండును |
దుష్టులన్ విడుచును • దూరముగను |
గీ. పెద్దవారలఁ గను గౌర • వించుచుండుఁ |
దల్లిదండ్రుల యాజ్ఞలఁ • దప్పకుండు |
లీలలందును దబ్బరల్ • లేకయుండు |
వాఁడె పొగడంగ భద్రిని • నా గుణములు ॥ 47.

క. జననీజనకుల వలనన్ |
తన జన్మ క్రమముఁ దెలిసి • దశరథసూనున్ |
గనుఁ గొనఁగ నెంచి వారల |
యనుమతిఁ గొని చనియె భద్రి • యటవీ స్థలికిన్ ॥ 48.

సీ॥ కానక కన్న సం • తానంబు గావునఁ |
గన్నవారల ఖేద • మెన్న వశమె ? |
సంసార వనధిలో • సంచరించెడి వారు |
కష్టముల్ సహియింపఁ • గావలయును |
దలఁచి చూడంగ వీ • చుల చందమునఁ బూర్వ |
కర్మముల్ దేహినిఁ • గలచుచుండు |
శోకమో సంతోష • మొకవేళను విడుగాక |
మొదవున నుండు నే • యుర్విలోన |

గీ॥ జనన మరణంబులకు నిల్క • స్థానమైన ।
భవజలధి నీద నేత్ర యు • పాయ మెద్ది ।
సకల జీవులయందును • సదయుఁ డగుచుఁ ।
బరగు చుండెడి పరమాత్ము • భక్తి దక్క॥ 49.

—• భద్రుఁడు తపంబున కేగుట •—

గీ॥ భద్రుఁ డమ్మాద్రి నదులను • బర్వతముల ।
దాటుచును బోయి గౌతమీ • తటముఁ జేరి ।
త్ర్యంబకంబను జోటునఁ • దానమాడి ।
ప్రీతితోఁ జేరె పంచవ • టీ తటంబు॥ 50.

సీ॥ అచ్చోటు వెడబాసి • యాతంపు దండకా ।
రణ్యంబుఁ బోడ గాంచి • ప్రీతి భక్తి ।
గౌతమీ మధ్యను • బ్రీతిశైల నిలచిన ।
వీరభద్రస్వామి • వినుతి సేయ ।
నా భద్రు నుతులకు • నద్దేవుఁ డలరారి ।
యాతని వాంఛి తం • బాత్మ నెఱిఁగి ।
యిట్లనె నతనితో • నిదెచూఁడు మీనదీ ।
పూర్వ భాగము నందుఁ • బొలుపు మీఱి ।
గీ॥ కానుపించెడి స్థలము ని • క్కముగఁ గరము ।
పావనంబగు నచటఁ ద • పంబుఁ జేయు ।
మనుచు నానతి యిచ్చిన • నచటి కేగ ।
నద్రినామంబు నగుబంబు • భద్రి యశోఁ॥ 51.

ఆ. చిలుకలు మొదలగు పక్షుల ।
పలుకులతో నమరి పాద ♦ పంబుల తోడన్ ।
తెలువారు నా స్థలంబునఁ ।
దలపోసెను గిరిసుతుండు ♦ తప మొనరింపన్ ॥ 52.

క. విమలగోదావరీజలముల ♦ వేడ్క మీఱ ।
స్నాన మొనరించి శుచియయి ♦ నగవరుండు ।
పశ్చిమాభిముఖుండయి ♦ పరమ భక్తి ।
నెనర శ్రీరాము రాకకై ♦ తప మొనర్చె ॥ 53.

ఉ. అంతకుమున్నె యీ భువన ♦ మంతయు వంతల పాలుఁ
జేసి యా । వంతయు నడ్డులేక బల ♦ వంతుఁడు రావణుఁ
డన్ ఖలుండు బల్ । కాంతిఁ దనర్చు నద్దనుజ ♦ కాంతుని
జంపఁగ దేవతల్ రమా । కాంతుని వేడ వారి కడ ♦ గండ్ల
ను బాపఁ దలంచి కూరిమిన్ ॥ 54.

## —♦ శ్రీరామచరిత్ర కథా సంగ్రహము. ♦—

సీ॥ మాధవాంశంబున ♦ మహిలోన జనియించి ।
దశరథ సూనుఁడై ♦ తనరి రాముఁ ।
డనుజేత వెలయుచు ♦ జనకుండు పంపవి ।
శ్వామిత్రుతో నేగి ♦ సమర మందుఁ ।
దాటక మర్దించి ♦ తపసి జన్నముఁ గాచి ।
మేటి సుబాహుని ♦ గీటడంచి ।

ఫాలాక్షు చాపంబు • భగ్నంబు గావించి ।
ప్రీతిమై జానకిఁ • బెండ్లియాడి ।

గీ॥ రామచంద్రుండు భార్గవ • రాము గర్వ ।
మెల్ల వారలు వీక్షింప • నుల్లమలర ।
భంగపఱచెను శ్రీరామ • పౌరుషంబు ।
నలవియే కొనియాడ ? వే • ల్పులకు నైన॥ 55.

క॥ జనకుండు కైకకు వశుఁడై ।
వనమునకుఁ దన్నుఁ బనుప • వనితా మణితో ।
ననుజునితో విపినమునకు ।
జనపతియగు రాముఁ డరిగె • సత్వర లీలన్॥ 56.

గీ॥ విరతమును దన్ను గొలిచెడి • భరతునకును ।
రాజ్యమును జేయు మానతి • రాముఁ డొసఁగి ।
చిత్రకూటాచలము నెక్కి • సీత కచటి ।
వింతలను జూపె శ్రీరామ • విభుఁడు వేడ్క॥ 57.

సీ॥ అచ్చోటు నెడబాసి • యారాఘవేంద్రుండు ।
దండకారణ్యంబు • దండఁ జేరి ।
గౌతమీ స్నానంబుఁ • గావించి తన్నదీ ।
మధ్యమ్ము నడుచు న • మంద కాంతి ।
వెలయుచు నుండెడి • వీర భద్రస్వామి ।
వినుతింప నాతండు • విరిచె భద్రి ।

చారిత్రి మంతయు • శ్రీరఘువరునకు ।
సద్దాని వాలించి • యాత్మ నలరి ।

గీ॥ తనదు భక్తుఁ డా భద్రునిఁ • గనుఁగొనంగ ।
రామ చంద్రుండు చనియెను • బ్రేమ తోడ ।
నట్లు చని భద్రు నెమటను । నతివ తోడ ।
ననుజు తోడను నిలచుండె • వినకులుండు॥ 58.

క॥ మేరుకుమారుం డా రఘు ।
వీరునిఁ దిలకించి మొలక • వెల్లి విరియఁగా ।
శ్రీరామ చంద్రు నిట్లని ।
నేరుపుతోఁ బొగడఁ దొచ్చె • నిశ్చల భక్తిన్॥ 59.

ఉత్సాహ॥ నీరజాక్ష! దైత్యదమన! నీలవర్ణ! రాఘవా! ।
మేరుధీర! జానకీశ! • మేదినీశ కుంజరా! ।
శూర! భక్త పారిజాత! • సూర్య వంశ దీపకా! ।
మార జనక! రూప విజిత • మార! దీన పోషకా!॥

క॥ కరుణాకర ! రిపులయినను ।
శరణని నిన్నుఁ జేరఁ బోచియు • జాణవుఁ గమ్మన్నా ।
కరి నేలినట్టి దిట్టవు ।
పరమాత్మా! నీదు పాద • భక్తుండ నయ్యా॥ 61.

క॥ తనువు శిలా మయముగఁ గన ।
వినుమిా నే జడుఁడ నైతి • విభు పుత్రుండన్ ।

నినుఁ గొని యాడఁగ, రఘువర! ।
వనజ భవుఁడు చాలఁ డనఁగ • వశమే నాకున్॥ 62.

కం॥ సీతావల్లభ ! నీవును ।
సీతయు లక్ష్మణుఁడు నాదు • శిరమున నెపుడున్ ।
ప్రీతి మెయి నిలువఁ గోరెద ।
నాతతకృప నాకు నొసఁగు • మా తద్వరమున్॥ 63.

ఆ॥ వె॥ భద్రుఁ డిట్లు తన్నుఁ • బ్రార్థింప రఘుపతి ।
యతనితోడ ననియె • నద్రి తనయ ।
యవతరించినట్టి • యక్కార్యమును దీర్చి ।
నీదు శిఖరమందు • నిలుచువాఁడ॥ 64.

కం॥ అని యానతిచ్చి దండక ।
వనమున నుచిత స్థలమునఁ • బర్ణకుటీరం ।
బును నొకటి కట్టికొని తన ।
యనుజునితో భార్య తోడ • నచ్చట నాగెన్॥ 65.

సీ॥ ఆవిపినంబున • రావణానుజ శూర్ప ।
ణఖ నివసించుఁ ద • న్నారి రాము ।
వీక్షించి యాతని • విభునిఁ గాఁ గోరిన ।
ఖండించె సౌమిత్రి • కాంతముక్కు ।
నంతట ఖరదూష • ణాదులు వచ్చిన ।
రాముండు చక్కాడె • రణములోన ।

నటునటు దశకంఠు • నంతికంబున కేగి ।
యా శూర్పణఖ యిట్టు • లనుచుఁ బలికె ।

గీ॥ నోరి నాయన్న నీవిటు • లూరకుంట ।
తగునె ? నాముక్కు రాముని • తమ్ముఁ డిటుల
గోసెనని యగ్రజుని మ్రోల • గోల్లు మనుచు
వెలఁది యేడ్వంగ సాగెను • వెక్కి వెక్కి॥ 66.

సీ॥ అక్కాంత నూరార్చి • యా యింతిచే సర్వ ।
వృత్తాంత మాలించి • వేగ రథము ।
ననలేని ఠీవితో • నెక్కి పఙ్క్తి ముఖుండు ।
మారీచు నంప న • మ్మాయ కాఁడు ।
బంగారు వన్నెతో • బసమీఱు నిఱ్ఱియై ।
నటియించు చుండ న • క్కుటిల మతిని ।
శ్రీరామ చంద్రుండు • శీఘ్రంబ నుగ్గాను ।
తఱిని సీతాదేవి • దైత్య విభుఁడు ।

గీ॥ రథము పై నిడి తా వడి • పథము నందుఁ ।
బోవు చుండ జటాయువు • త్రోవ కడ్డ ।
మగుచుఁ బోరిన నాతని • సమర చంపి ।
త్వరితముగ నేగెఁ దన రాజ • ధాని కంత॥ 67.

క॥ సీతను గానక రఘుపతి ।
సీతాయని పలవ రించు • సేగిఁ జెందుఁ ।

చ॥ జనకా నేను నీదు భుజ • శాఖల చాటున నుండ నా కెగా ।
వనమున భీతియేల యని • పల్కిన పల్కు వృథాయె నే
డ్యోగా ! వనజదళాయతాక్షి! నిను • వంటి సుభార్యను
గావలేని నా । జననము వ్యర్థమాయెను ని • జంబుగ ; ...
యింక నేమి సేయుదుర్గా?॥ 73.

క॥ పికమా ! సీతను బాయుట ।
శుకమా, చిగురాకు మెక్కి • సొక్కుచు నీకే బా ।
డికమా ; రోషంబును జూ ।
పకుమా ; వినకున్నఁ జేటు • వాటిల్లుఁ జుమా॥ 74.

ఆ॥ అట్టు లలమటఁ జెందెదిని • యగ్రజునకు ।
లక్ష్మణుండు ధైర్యమును జెప్పి • లలన వెదుకు ।
తఱి జటాయువుఁ గన్గొని • దహన మొసరఁ ।
జేసి ఋశ్యమూకము దాను • జేరి రంత॥ 75.

సీ॥ వాలిని వధియించి • వాని రాజ్యంబును ।
సుగ్రీవునకు నిచ్చి • సొంపు మీఱ ।
శ్రీరామచంద్రుండు • సీతను వెదుకంగ ।
హనుమంతు నంపిన • నతఁడు వనధి ।
నలవాటు కలిమిచే • నవలీలగా దాటి ।
లలనను గన్గొని • లంకఁ గాల్చి ।
రాముని పాలికి • రయమున వచ్చి నీ ।
కా కథనంబును • దగ వచింప ।

గీ॥ రాము చంద్రించు కపి వేగి • రంబు కదిలె ।
ప్లవగ సైన్యంబు లను గూడి • లంక జేరను ।
త్రోవ కడ్డ మై యుండిన • తోయధి గని ।
సేతువును గట్టె జలధిపై • శీఘ్రముగను॥ 76.

క॥ రామ బలిమ్ముగను తన్నగ ।
గావు మనుచు శరణు వేడఁ • గా నభయంబుగ ।
భూవరుఁ డొసంగి లంకకు ।
నే వడలెను సేన తోడ • విబుధులు మెచ్చగ॥ 77.

సీ॥ ఆ సమయంబున • నసుర వానరులకు ।
బహు ఘోర రణము సం • ప్రాప్త మయ్యె ।
హరితోడ హరియును • గిరితోడ గిరియును ।
బోరెడి విధమునఁ • బోరి రలుకఁ ।
సెలఁగి వీరాలు సేయ • సింహ నాదములతో ।
భూ నభోంతరములు • పూర్ణ మయ్యె ।
రక్త ప్రవాహంబు • ప్రవహించె ఖండి తా ।
వయవముల్ ఝషముల • వలెఁ దనర్ప ।

గీ॥ నట్టి ఘోరఖండనమున • నసురు లెల్ల ।
మ్రగ్గుటను గాంచి దేవారి • మండి పడుచుఁ ।
బుష్పకారూఢుడై యేగెఁ • బోరునకును ।
వివిధభూషణంబులఁ దాల్చి • విక్రమమున॥ 78.

క॥ మాతలి తెచ్చిన తేరును ।
సీతేశుం డెక్కి దైత్యు • శీఘ్రము చంపెన్ ।
ప్రీతినిఁ బొందిరి నిర్జరు ।
లాతత దుఃఖంబు నొంది • రసు రాంగనలున్ ॥ 79.

ఆ॥ వె॥ వహ్ని వలనఁ దనదు • భార్య నిర్దోషత్వ ।
మెల్లరకును నృపతి • యెఱుఁగఁ జేసి ।
దేవతలు నుతింప • దేవిఁ జేకొని లంక ।
రావణానుజునకు • రాముఁ డొసఁగె॥ 80.

ఆ॥ వె॥ సురలు గురియు పూల • సోనలఁ దడియుచు ।
హనుమదాదులెల్ల • నలరి కొలువఁ ।
బుష్పకంబు నెక్కి • పురవరం బగు నయో ।
ధ్యకును రాముఁ డరిగె • నతి ముదమున॥ 81.

ఆ॥ వె॥ అన్న వచ్చు టెఱిఁగి • యతి భక్తి పాదుకల్ ।
మోచి కొనుచు వచ్చి • మ్రొక్కి భరతుఁ ।
డతని నాదరించి • యతనితో వచ్చిన ।
బ్రాహ్మణులకు మ్రొక్కె • రామ నృపతి॥ 82.

క॥ అంత నయోధ్యా పురిని వ ।
సంతంబులఁ బూలతోడ • సల్పిరి జనముల్ ।
సంతోషముతోఁ బాడిరి ।
వింతయయిన కాంతి గలిగె • వీటికి నెలమిన్॥ 83.

ఆ॥ వె॥ రాజసదనమునకు • రామజనేంద్రుండు ।
వచ్చు సమయమందు • వన్నె మీఱ ।
రామమయము యగుచు • రాజిల్లె సౌధాగ్ర ।
భాగములు పురాన • భాసురముగ॥ 84.

శా॥ సీతాజానియు లక్ష్మణుండు గృహముల్ • జేరంగ మో
దించి త । న్మాతల్ సూనులఁ బెద్ద కోడలినిఁ బ్రే • మం
జేసి ముద్దాడుచుల్ । మాతండ్రుల్ చను దెంచి నారె
యిటకుల్ • మాయమ్మ! మా కూన యో సీతా! యెట్లు
చరించితే యడవిలో ? • శీతాంశు బింబాననా! ॥ 85.

గీ॥ ఇట్టు లడిగెడి యత్తల • కెల్ల మ్రొక్కి ।
జానకీదేవి వారల • సరస నుండి ।
తేనె లొలికెడి పలుకులఁ • దెలిపె వనుల ।
వార్తలను బూస గ్రుచ్చిన • భంగి దనర॥ 86.

గీ॥ రాముఁడును లక్ష్మణుండును • ప్రేమ తోడ ।
మాతలకు మ్రొక్కి వారలు • ప్రీతి నొంద ।
సమరమున రావణాదులఁ • జంపి నట్టి ।
వార్త లన్నియుఁ దెలిపిరి • వారలకును॥ 87.

సీ॥ పట్టాభిషేకోత్స • వంబు వసిష్ఠుండు ।
కులవృద్ధులును జనం • బులు నొనర్ప ।
భరతుఁ డర్పించిన • భవ్య సింహాసనా ।
సీనుఁడై ప్రజలను • నేలుచు మీఱి ।

పదునొక వేల సం • వత్సరంబులు వరి ।
పాలించె రాముండు • ప్రజలు సౌఖ్య ।
వారాశిలో మున్గి • వర్ధిల్లు చుండిరి ।
ధర్మ మెల్లెడలను • దనరు చుండెఁ ।

గీ॥ దండ్రి కై వడి శ్రీరామ • ధరణి పతిని ।
జనము లెంచుచు నుండి రా • జవరేణ్యుఁ ।
డవతరించిన పనిదీరి • నంతఁ దనదు ।
మొదలి నెలవున కేగెను • ముదముతోడ॥ 88.

ఉ॥ రాముని రాకకై మనసు • రంజిల భద్రుఁడు పెక్కు వర్ష
ములే । ప్రేమ యెలర్పఁ గాచికొని • వీడఁడు రాముఁడు
రామిఁ జేసి యా స్వామిఁ దలంచుచుండెను న • జస్రము ;
పిమ్మట నారదుండు శ్రీ । రాముని వార్తఁ దెల్పఁగ దు •
రంత విషాదము నొందె నాత్మలోఁ॥ 89.

గీ॥ నారదుం డుపదేశించె • నలిననాభుఁ ।
గూర్చి తప మాచరింపుము • కొండకొమర ॥
నీదు కోరిక కొనసాగు • నిశ్చయముగ ।
నను సల్లాపరింపంగ • నాతఁ డెంచి॥ 90.

గీ॥ భద్రుఁ డిట్లని తలపోసె • భావమందు ।
నవతరించిన పనిదీరి • నంత నీదు ।
శిరమునం దుందువని నాకుఁ • జెప్పె యేల ।
రాముఁ డింకను రాఁడాయె • ప్రేమనిధీ! ॥ 91.

గీ॥ అవతరించిన పనిదీర • దతని కొపుడు ।
నవతరించుట యనుమాట • యనృతమగును ।
అజుఁడు గావున శ్రీహరి • యవతరించె ।
ననుచు జనములు పల్కుట • యగును గల్ల॥ 92.

మ॥ అరయన్ శ్రీహరి పెక్కునామములచే • నాయాయికాలం
బులన్ । గరముగ్ దుష్టులఁ గిన్కతోఁ బలుమఱున్ •
ఖండించుచున్, శిష్టులన్ । బరిరక్షించుచునుంటఁ గాంచి
జనముల్ • భావింతు రక్షార్థుఁ డిద్ధర జన్మించె నటంచు
జన్మచయముల్ • దైత్యారికిన్ గల్గునే? ॥ 93.

క॥ హరిమాయ హరియె యెఱుఁగును ।
హరిమాయా లీలలకును • నంతము గలదే? ।
శిరమున వసించు మఱుచును ।
హరిఁ గోరుట తలఁచి చూడ • నజ్ఞానంబౌ॥ 94.

క॥ అరయఁగ విష్ణుం డంతటఁ ।
బరిపూర్ణుండగుచు నుండఁ • బద్మాక్షుఁడు నా ।
శిరమున నుండెడె ? యాతని ।
నరయఁగ శక్తి నకట • యజ్ఞానముచేన్! ॥ 95.

క॥ హరికరుణ చేత నిప్పుడు ।
పరిపాకముఁ జెందె మనము • పావనులై సం ।
సారాబ్ధి మునుఁగు నరులకుఁ ।
బరిపాకము గలుగు టరుదు • భావింపంగన్॥ 96.

ఉ॥ కావున రామరూపమును • గైకొని నాశిరమందు నిల్పి ప
ద్దేవుని శ్రీరమాపతి ను • తించెదఁ దద్దయు భక్తి పెంపు
న౯ । భూవిభుఁడైన యాపరమ • పూరుషుఁ డాదరించి వచ్చి
రక్తితో । సేవ లొనర్చువారి • యఘచేతన మాన్పియను
నిల్పుఁ గావుత౯॥ 97.

ఆ॥ వె॥ భద్రుఁ డిట్టువలంది • బహుకష్టముల కోర్చి ।
ప్రజలమేలుఁ గోరి • పరమ తపము ।
వేయివత్సరములు • విష్ణుఁగూర్చి యొనర్చె ।
వాయుభక్షుఁ డగుచు • వనమునందు। 98.

గీ॥ చెలఁగి సర్వేశ్వరుని యంద • జీవితమును ।
కరము ఘటియింపఁ జేసె । నగ్గిరిసుతుండు ।
గాన సర్వేశ్వరుఁడు తడఁ • గంప మందె ।
నంత సర్వలోకంబులు • నతలఁ జొచ్చె॥ 99.

ఉ॥ ఆ యెడమ౯ గనుంగొనుచు • నాతని వారింప సించి
పాలికి౯ । బోయి సమస్త దేవతలు • ముక్తక-గ వారల
తోడ భారతి । వాయువుఁ జేగ మురుగిరి • వందను పాలికి
నట్లుపోయి యాధియుతుఁ గాంచి శాంభికముఁ • జెల్పు
మొనంగదనంచుఁ బల్కిన౯॥ 100.

గీ॥ భద్రుఁ డిట్లన నతనితో • బ్రహ్మదేవ ।
రామచంద్రుంను నాశిఖ • రంబు నందుఁ ।

దగ వసింపంగఁ గోరి యీ • తపముఁ జేయు ।
చున్నవాఁడను బరమాత్మ • తో విధాత!॥ 101.

గీ॥ అవతరించిన వనిదీరి • నంత నీదు ।
శిఖరమం దుందునని నాకుఁ • జెప్పి రామ ।
విభుఁడు వైకుంఠపురికిఁ దా • వెడలిపోయెఁ ।
గరుణ లేదయ్యె నామీఁద • ధరణిపతికి॥ 102.

గీ॥ జానకీజాని నాయందు • సదయుఁ డగుట ।
యెన్నఁడో శుభప్రదములై • యెసఁగునట్టి ।
యతని పాదారవిందంబు • లాత్మ శిఖర ।
మందు వహియించు టెన్నఁడో • డెందమలర॥ 103.

క॥ అని యిట్లు వగచు భద్రునిఁ ।
గనుఁగొని కమలాననుండు • కరుణా మయుఁడై ।
వనజదళాక్షుని చెంతకుఁ ।
జనియెద నీకోర్కెఁ జెప్పు • శైలకుమారా!॥ 104.

క॥ వగవకుమని ధైర్యంబును ।
దగఁజెప్పి విరించి యేగ • దైత్యారాతిన్ ।
ఖగరాజ తురగు హరిఁ బ ।
న్నగశయనునిఁ జూడ సురగ • ణంబులతోడన్॥ 105.

సీ॥ పద్మాసనుం డంత • వైకుంఠ ధామంబు ।
సంతోషమునఁ జొచ్చి • జలజనయను ।

వీక్షించి రిపో దేవ! • విన్నపం బొక్కటి ।
యున్నది యాలింపు • మోముకుంద! ।
మేనకకుమారుండు • చారుచరిత్రుండు ।
భద్రుండు నానొప్ప • భద్రియశుండు ।
ఘోరతపంబును • ధారుణీ స్థలమునఁ ।
గావించుచున్నాఁడు • కంజనేత్రి! ।

గీ॥ వరమొసంగితిరట వాని • శిరమునందు ।
నిలచి యుండంగ నద్దాని • నెదను మఱచి ।
వరవికుంఠంబుఁ జేరిన • వార్తను విని ।
కరము దుఃఖంచుచున్నాఁడు • పరమపురుష! ॥ 106.

క॥ అని పలుకు సరసిజాసనుఁ ।
గనుఁగొని కనకాంబరుండు • ఘనుఁ డిట్లనియెన్ ।
గనకాచల వరసుతునకు ।
మును నొసఁగిన వరముఁదీర్పఁ • బోయెదను సుతా! ॥ 107.

గీ॥ ఎల్లదేవతలను గూడి • యేగి భద్రి ।
పర్వతముచుట్టు నిలువుమీ • త్వరితముగను ।
రామరూపంబుఁ గైకొని • రమణితోడ ।
వనుజాతోడను వచ్చెద • వచటి కిపుడు ॥ 108.

క॥ అని కైటభారి పల్కఁగ ।
ఘనతర హర్షమును బొంది • కమలాసనుఁ డిం ।

పెసఁయగ దివిజాలతో నే ।
గెను భద్రాచలముఁ జేరఁ ♦ గేశవ్రుఁ డంతట॥ 109.

సీ॥ శ్రీరామరూపంబుఁ ♦ జెలువారఁ దాలిచి ।
పట్టాభిషేకోత్స ♦ వంబు జరుగు ।
నప్పు డేరీతిని ♦ నలరారెనో యట్లు ।
వివిధభూషణములఁ ♦ వేడ్కఁ దొడిగి ।
పీతాంబరంబును బ్రీతిమై ధరియించి ।
శంఖము జక్రముల్ ♦ గార్ముకంబు ।
శరమును నాలుగు ♦ కరములఁ దనరార ।
భార్యయుఁ దమ్ముండు ♦ భక్తిఁ గొలువ ।
గీ॥ నధికదీప్తిమై భద్రాద్రి ♦ నవతరించి ।
భక్తవరుఁడైన భద్రుని ♦ బరమహర్ష ।
వార్ధిలో మున్గఁగాఁ జేయ ♦ వనజభవుఁడు ।
సురలు శ్రీరాముఁ బొగడిరి ♦ కృరణి భక్తి॥ 110.

మ॥ వరముల్ పొందితి బ్రహ్మచేతనని గ ♦ ర్వంబున్ మదిన్
బూని భీ । కరుఁడై రావణుఁ డుద్ధతిన్ భువనముల్ ♦ గ
ష్టాబ్ధి ముంపఁగ నం । దురితాత్మున్ రణరంగమందుఁ గిను
కన్ ♦ దున్మాడి లోకంబులన్ । బరిరక్షించిన రామ నిన్ను
మదిలో ♦ భావింతు మెల్లప్పుడున్॥ 111.

చ॥ శరణని వేడఁగాఁ గృపను ♦ శత్రుని తమ్ముని నవ్విభీషణున్ ।
గర మనురక్తి రాజుగ నొ ♦ నర్చితవార మహాత్మ! నీకు న ।

వ్వారుపరు లేరుబాంధవులో • యేర్పడఁ జెప్పఁగ శక్యమా
నే? సత్కరుణను శిష్టబృందమును • గాఁచి వధింతువు దుష్ట
బృందముల్ ॥ 112.

మత్తకోకిల॥ లోకరక్షక నీమకుక్షిని • లోకముల్ దనరార భూ।
లోకమందునఁ బుట్టినావని•లోకు లెంచుటవింత లో।
కైకభర్తవు రూపహీనుఁడ • వాదిమధ్యము నంత
ముల్। లేక యొప్పుచు నుండువాఁడవు • నిర్భయంక
చెద దీశ్వరా!॥ 113.

తోటకవృత్తము॥ మక్కువమీఱఁగ • మానసమందున్ ।
నిక్కముగా నిను • నిశ్చల భక్తిన్ ।
మొక్కెడివారల • మొజ్జల నెల్లన్ ।
గ్రక్కునఁ దీర్తువు • కంజదళాక్షా! ॥ 114.

క॥ మానము నీ పదభక్తిని ।
గానము సేసెదము, నీదు • కథ లనయుంబున్ ।
గానము నీకు సమానుని, ।
ధ్యానము సేసెదము నిన్ను • దనుజవిపక్షా! ॥ 115.

క॥ అని తన్ను నుతియొనర్చెడి ।
వనజాసని దేవతలను • వారని కూర్మిన్ ।
గనుఁగొని దశరథసుతుఁ డి ।
ట్లనియెన్ దరహాసము మర • నాననమందున్॥ 116.

ఉ॥ మీరలు సర్వకాలమును • మిక్కిలి కూరిమితోడ భద్రి
నిం । పారఁగఁ బ్రోవఁగావలె మ • హాత్ముఁడు మత్ప్రియా
భక్తుఁడై తగున్ । వారిజసంభవా ! దివిజవల్లభ ! నాప్రి
యభక్తబృందముల్ । వారని సంతసంబుఁ గన • వారని
సంతసమేను గాంచెదన్॥ 117.

ఆ॥ వె॥ రామభద్రుఁడనుచు • ప్రజలెల్ల ననుభక్తిఁ ।
గొలుచుచుండ నిచట • నిలచియుందుఁ ।
ప్రజలమేలుఁ గోరి • భవ్యుఁ డీ భద్రుండు ।
నన్ను నిటకుఁ దెచ్చె • నయముమీఱ॥ 118.

## —• భద్రాద్రి మహిమ •—

సీ॥ ఇచ్చటఁ బ్రవహించు • నీ గౌతమీనది ।
విరజానదియటంచు • విమలభద్రి ।
శిఖరంబు వైకుంఠ • సీమయంచు దలంచి ।
యిచ్చోట నివసించు • సచ్చరితులు ।
పుత్రపౌత్రాదులఁ • బొంది సంపదలతో ।
నలరారుచుండెద • రనుదినంబు ।
నంత్యకాలంబున • నలవికుంఠపురంబుఁ ।
జేరంగఁ గలరు మ • త్కృపతోడ ।
గీ॥ నన్ను దానాములను నిట • నాచరించి ।
ప్రజలు భక్తితోడను ఖాను • వారమందు ।

పదిని స్నానంబుచేసి యీ • పగముచుట్లు ।
మూఁడుసారులు దిరుగంగఁ • బుణ్య మొదవు॥ 119.

ఆ॥ వె॥ రామభద్రుఁడిట్లు • బ్రహ్మనులకుఁ జెప్ప ।
వారు సంతసించి • వారివారి ।
తావులకును జనిరి • తాపసోత్తములార ! ।
వినుఁడి భద్రు పూర్వ • విమలచరిత ॥ 120.

సీ॥ అని సూతుఁడిట్లనె • నా శౌనకాది ము ।
నీశ్వరవరులతో • నిలను మున్న ।
త్రేతాయుగంబులు • దీపించె నెన్నిమే ।
నట్టిదా నొక త్రేత • యందు రాముఁ ।
డనుజసమేతుఁడై • యతివతో దండకా ।
రణ్యంబునకువచ్చి • రహిఁ జెలంగ ।
నతి నిర్మలంబును • నతి విశాలంబునై ।
యలరారు పాషాణ • మచటఁ గాంచి ।

గీ॥ దానిపై విశ్రమింపంగ • ధరణిపతికిఁ ।
గరము సౌఖ్యంబు గలిగిన • కారణమున ।
మేరుగిరికి సూనుండవై • మించి నాదు ।
భక్తి నలరారఁగలవని • ప్రభుఁడు వల్కె॥ 121.

క॥ ఆపాషాణమె వినుఁడీ ।
యేపారఁగ భద్రుఁడనఁగ • నిలపైఁ బరగెఁ ।

భూపాలుఁడైన రాఘవు ।
శ్రీపాదంబుల నహించు • శిఖరమునందుఁ॥ 122.

ఆ॥ వె॥ భద్రపర్వతంబు • బహుపుణ్యభాజనం ।
బగుచు నలరుచుండు • నవనియందు ।
భద్రు మహిమఁ దెలుపు • భావుకకథ నొండు ।
పలుకువాఁడ వినుఁడి • భవ్యులార॥ 123.

—• శేషేశ్వర చరిత్రము, ఉష్ణకుండము •—

సీ॥ పూర్వకాలమునందుఁ • బుణ్యచారిత్రుండు ।
శేషుండు పాతాళ • సీమయందుఁ ।
బూజ్యంబుగాఁ దాను • రాజ్యంబుఁ జేసెడి ।
తఱిని గొందఱు ఖలుల్ • దనుజులతని ।
రాజ్యహీనునిఁజేయ • బ్రహ్మ చెంతకుఁబోయి ।
శేషుండు తనదు దు • స్థితినిఁ దెలుప ।
బ్రహ్మ యిట్లనియె నో • పన్నగవల్లభా ।
భద్రాద్రి నా నొప్పు • పర్వతంబు ।
గీ॥ ధాత్రి వెలుగొందు గౌతమీఁ • తటమునందు ।
నచ్చటికినేగి యీశ్వర • ధ్యాన మొనరఁ ।
జేయఁగా నీదు కష్టముల్ • శిథిలమగును ।
ననుచు ధరణికి నేగె న • య్యహివిభుండు॥ 124.

గీ॥ ధారుణికి నేగి గౌతమీ • తీరమందు ।
భద్రగిరి దరి నత్యంత • భక్తితోడ ।

శంకరునిఁగూర్చి చేసెను • జపతపంబు
లగ్నికుండంబు నొకదాని • నచట నిలిపి॥ 125.

ఉ॥ అంద భిచారహోమము మ • హాత్ముఁడు శేషుఁడొనర్ప మె
చ్చి యా । యిందు కళావతంసుఁడు మ • హేశుఁడువచ్చి
యహీశ తెల్పు నీ । డెందములోనివాంఛ భవ • దీయ
జపాదుల కాత్మలోన నా । నందముఁ జెందినాఁడ నన •
నాగవరేణ్యుఁడు మోదితాత్ముఁడై॥ 126.

గీ॥ శంభుతో నిట్టులని పల్కె • శంకర ! హర ! ।
విన్నపముఁ జేయుచున్నాఁడ • వినుము కరుణ ।
దానవులు రాజధానిపై • దాడి వెడలి ।
యాక్రమించిరి కృపఁగావు • మా మహాత్మ! ॥ 127.

గీ॥ భక్తసులభుండు భర్గుఁ డా • పలుకులు విని ।
వేడ్క దళుకొత్త నా ఫణి • విభున కొసఁగె ।
శూలమొక్కటి ; దానిచేఁ • గూలనేసి ।
సర్వవైరుల ననిలోన • సర్పరాజ॥ 128.

సీ॥ ఫణిపతి యారీతిఁ • బశుపతి మెప్పించి ।
శూలంబుఁ గైకొన్న • చోటు కరము ।
శేషేశ్వరంబన • క్షితిమీఁదఁ జెన్నారె ।
నభిచారహోమంబు • నతఁ డొనర్చి ।
నట్టి యాకుండంబు • ఖ్యాతిని వహియించె ।
నుష్ణకుండంబు నా • నుర్విలోన ।

నచ్చోటి నీరంబు • లత్యుష్ణముగ నుండు ।
బ్రహ్మలోక పాతాళ • గంగ లచట ।

గీ॥ సంగమించుట కతన నా • స్థాన మధిక ।
పావనంబయ్యె నచ్చోట • భక్తితోడ ।
స్నానపానాదులను జేయు • జనుల ముక్తి ।
కాంత వరియించుచుండును • సంతసమున॥ 129.

సీ॥ వెలఁగి యీవిధమునఁ • జేయంగనోపని ।
మనుజులు భద్రాద్రి • మహిమ తమదు ।
మానసంబులయందు • మహితసుభక్తితో ।
నిచ్చలుఁ దలపోసి • నగడితేని ।
కామితార్థంబులఁ • గైకొని సుఖయింతు ।
రంత్యకాలమున వా • రరుగ గలరు ।
పరమహర్షంబునఁ । బరమపదంబున ।
కని సూతుఁ డిట్లనె • మునులతోడ ।

గీ॥ రామనవమిని భక్తితోఁ • బ్రజలు భద్రి ।
శిఖరమున రామభద్రుని • సేవఁజేసి ।
రామకీర్తనములఁ బాడి • రాత్రియందు ।
మేలుకొనినంత వారికి • మేలుగలుగు॥ 130.

గీ॥ రామభద్రుని మొదలచే • బ్రిబలుచుండు ।
భద్రిశిఖరంబుచుట్టున • బ్రికిత తీర్థ ।

రాజసులుగాన నట మూఁడు • రాత్రులెలమి ।
జనులు వసియింపఁగలుగు శ్రీ • శ్వేతముఖంబు॥ 181.

సీ॥ మఱియు నొక్క విశేషంబు • మానులార ! ।
వినుఁడి నారదునకు మున్ను • వేద్యమీఱ ।
భద్రశిఖరి మాహాత్మ్యము • బ్రహ్మ దెలుప ।
నచటికేగెను సురమౌని • యధికభక్తి॥ 182.

క॥ చిరకాలము శ్రీరాముఁ ।
గరమరుదుగఁ గొల్చి రమ్య • గానాదుల భూ ।
వను మెప్పించెను బిమ్మట ।
సురలోకంబునకుఁ బోయె • సురముని పేర్మిన్॥ 183.

క॥ భద్రాద్రిచరిత మెవ్వఁడు ।
భద్రాచలధాము కరుణఁ • బ్రబలుత ధర నీ ।
భద్రాద్రిచరితఁ జదువఁగ ।
భద్రంబులు గలుగుఁ గాక • పాతకతతికిన్॥ 184.

క॥ అని తెల్పు సూతుఁ గనుఁగొని ।
మునివర్యులుపొగడి రతని • బుధనుత ! నీచే ।
ఘనుఁడగు భద్రుని చరితన్ ।
మనమలరఁగ వింటిమయ్య • మాన్యచరిత్రా॥ 185.

గీ॥ సూతుఁ డీరీతి మునులకుఁ బ్రీతితోడ ।
నెఱుఁగఁ బల్కిన భద్రాద్రి • చరితమైన ।

దీని ముగియించుటకు మున్ను • తెలుపువాఁడ ।
స్వాంత మలరంగ గోపన్న • చరిత కొంత॥ 136.

—• గోపన్న చరిత్ర •—

సీ॥ చెలువారుచుండును • గలియుగవైకుంఠ ।
మనఁగ భద్రాచలం • బవనిలోన ।
శ్రీరామభక్తిచేఁ • జెలఁగెడి తమ్మల ।
దమ్మక్క నానొప్పు • ధన్యురాలు ।
స్వప్నంబులో రామ • చంద్రుఁడానతి యిచ్చి ।
నట్టులా రఘుపతి • కధికభక్తిఁ ।
బూజల నొనరించి • బుధనుతుండగు భద్ర ।
రెడ్డి సహాయంబుఁ • బ్రీతినొంది ।
గీ॥ చిన్నమంటప మచ్చోటఁ • జెన్నుమీఱ ।
విబుధులెన్నంగఁ గట్టించెఁ • బిదప నటకుఁ ।
బ్రథితయశుఁడైన గోపన్న • భక్తితోడ ।
నేగి రఘురాము దర్శించు • నిచ్ఛ వొడమి॥ 137.

గీ॥ కొండపల్లి నివాసుఁడా • గోపనాఖ్యుఁ ।
డతఁడు భద్రాద్రి మహిమంబు • నవధరించి ।
భద్రగిరిధాముఁ గొలిచెడి • భాగ్యమెప్పుడా ।
యనుచుఁ జింతించుచుండు ని • త్యంబు మదిని॥ 138.

గీ॥ అతని కొకరేయి స్వప్నంబు • నందు రాముఁ ।
డధికకృపఁ గానుపించి యి • ట్లనియె వత్స ! ।

పిప్ప గోల్కొండకేగి తా ◆ నీషఁ జూఁడు ।
మఱిని కతన మేలయ్యెడు ◆ ననఘ వింటె " ॥ 139.

గీ॥ అంత గోపన్న మేల్కాంచి ◆ యాప్రతతికి ।
వేడ్క నెఱిఁగించె శ్రీరామ ◆ విభుని ముదల ।
నాదినమునందె గోల్కొండ ◆ కతఁడు వోయి ।
నిలచె వినయంబుతోడఁ దా ◆ నీష మ్రోల॥ 140.

సీ॥ తానీష యతనికి ◆ దయతోడ నిట్లను ।
భద్రాద్రిమండల ◆ ప్రభుత నీకు ।
నొసఁగినారము గాన ◆ వెసఁబోయి తహసీలు ।
దారు కార్యంబులఁ ◆ దగ నొనర్పు
మని యాజ్ఞనొసఁగిన ◆ నతఁ డతి ముదితాత్ముఁ ।
డగుచు భద్రాద్రికి ◆ నతిరయమునఁ ।
జనుదెంచి సామి సా ◆ మ్మని తలపోయక ।
భద్రాచలముమీఁద ◆ భవ్యమైన ।

గీ॥ కోవెలను దగనిర్మించి ◆ గోపురంబుఁ ।
గట్టి యచ్చోట జానకీ ◆ కాంతునకును ।
భక్తిపెంపునఁ బూజలు ◆ ప్రతిదినంబుఁ ।
జేయుచుండెను నిర్మల ◆ చిత్తుఁడగుచు॥ 141.

గీ॥ అంతఁ దానీష యతని చ ◆ ర్యలను భటుల ।
వలన నాలించి కోపించి ◆ భటులఁగాంచి ।

యగని ద్రోహుఁడీ చెఱసాల • యందు ననుచు ।
నానతిచ్చిన వారలా • యనఘుఁ బట్టి॥ 142.

క॥ కారాగృహమున నుంపఁగ ।
ధీరుఁడు గోపన్న మది ను • తించుచు నుండెన్ ।
వీరుఁడగు రామభద్రుని ।
గారవమున నంత నతనిఁ • గాంచెను కాంక్షన్ । 143.

క॥ రాముఁడు తమ్మునితోడన్ ।
చేరియు దానీషదరికి • వెడలి యతనితో ।
" మేమిదె గోపన భటులము ।
మేమొసఁగెడి ధనము గొనుమి • మిషగాదు సుమీ!" 144.

గీ॥ ఇట్లు తానీషతోడ సీ • తేశుఁ డెలమిఁ ।
బలికి ద్రవ్యంబుఁ జెల్లించి • నిలువ కపుడె ।
వెడలె నిసిలోనఁ ; దానీష • వెఱఁగు పడుచు :
దారమేల్కొల్పి తెల్పె వృ • త్తాంత మెల్ల॥ 145.

సీ॥ బంటువేసంబుఁ దాలిచి • భక్తుకొఱకు ।
మనగృహంబున కేతెంచె • నినకులుండు ।
భక్తవత్సలుండనుచును • బ్రాజ్ఞులాడు ।
వాక్యమది యేల తప్పునే • వారిజాక్షి! ॥ 146.

క॥ రాముఁడు వచ్చిన మన మా ।
సామికిఁ దగినట్టి పూజ • సలుపమి కకటా !

నామనమున దుఃఖించెద ।
నోమానిని యనుచుఁ బలికె • నుగ్మలితోడఁగ॥ 147.

గీ॥ వేగినంతన భటులు రా • వించి వారిఁ ।
బంచి గోవన్నసటకు ర • ప్పించి మించి ।
యంచితోక్తుల నతని మ • న్నించి మోము ।
వంచి యిట్లనెఁ దానీష • భక్తునకును॥ 148.

ఉత్సాహ॥ ఇంతవాఁడ వనుచు నేను • నెఱుఁగనైతినయ్య గో।
రంతయైన నీదుమదిని • సలుక బూఁనవలదు ధీ।
మంత ద్రవ్యమిదిగో దీని • మహితదయను జాననీ।
కాంతునకు నొసంగుమనఁగఁ • గరమునలరె నా
నఁదుఁగ॥ 149.

గీ॥ వివప శ్రీరాముకరుణను • బ్రియముతోడఁ ।
జారగొనియెఁ గైవల్యంబు • సుజనహితుఁడు ।
రామదాసగు గోవన్న • ప్రథితయశుఁడు ।
భద్రము లొసంగు జనులకా • భవ్యచరిత॥ 150.

తరలము॥ ధరణినాయక! రూపనిర్జిత • దర్పకా! రఘునాయకా।
పరమపావననామ! దానవ • భంజనా! కరుణాకరా! ।
ఖరకరాన్వయ వార్ధిచంద్రమ! • కంధిగర్వనివారణా! ।
దురితవారణ! కీర్తినిర్జిత • తోయజారి హిమాంబుజా!॥

భుజంగప్రయాతము॥ సరోజాక్ష! శ్రీరామ! సర్వేశ! ధీరా! ।
సురారాతి సంహార! నానాగ్రగణ్యా! ।
ధరాజావరా! మేరు ధైర్యా! మహాత్మా!॥
స్మరారాతిలోకేశ దంభారివంద్యా! 152.

గద్య॥ ఇది శ్రీరామచంద్ర పాదారవింద సేవా పరాయణ
పైడిపాల గోత్రపవిత్ర బొంపాక కోవంశ
రామస్వామి పుత్ర బుధజన విధేయ
సూర్యనారాయణ నామధేయ ప్రణీ
తంబైన నిర్వచన భద్రాద్రి
చరితంబునందు సర్వ.
మేకాశ్వాసము.

శ్రీ భద్రాద్రిచరిత్రము సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక.

| పుట సంఖ్య | పద్యము సంఖ్య. | పాదము సంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 3 | 5 | 3 | జననములు | జనములు |
| 6 | 17 | 2 | తపము | దపము |
| 26 | 96 | 3 | సంసరగాబ్థి | సంసరగాబ్ధి |
| 30 | 112 | 2 | నౌసర్పితవార | నౌసర్పితివార |

